# జమీన్‌రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 19
సంపుటి: 58 సంచిక: 5
18-12-1987
శుక్రవారం
12 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు • • • మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# రామారావు పతనం శీనయ్య కలేనా?

శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఒక వైపు జిల్లా పర్యటనలు, మరొక వైపు అసెంబ్లీ చర్చలలో పాల్గొంటున్నారు. ఉదయంవేళ అసెంబ్లీ సమావేశాలలో పాల్గొని, సాయంత్రంవేళ నిమిషంలోని జిల్లా కేంద్రాలలో ఆయన బహిరంగ

## (హైదరాబాదు వర్తమానం)

సభలలో పాల్గొంటున్నారు. శ్రీనివాసులు రెడ్డికి ఆత్మీయ ఎక్కువలేని ఓపిక వచ్చి పట్టు వుంది. మామూలుగా ఆయన ఆరోగ్యం అంతంత మాత్రమే! అయినా శ్రీ రామారావుపైన, ఆయన కుటుంబం పైన కసితో శ్రీనివాసులురెడ్డి విస్తృతంగా పర్యటన చేస్తున్నారు. ఆయన సభలకు వేలాదిగా జనం వస్తున్నారు. జిల్లా కేంద్రాలలో కాబట్టి ఆయన సభలకు ఈ విధంగా జనం రావడంలో ఆశ్చర్యం లేదు. రామారావు ప్రభుత్వానికి బద్ధ వ్యతిరేకులైన విద్యావంతులు, ఉద్యోగులు, ఇతర మధ్యతరగతి ప్రజానీకం ఆయన సభలకు ఎక్కువగా తరలి వస్తున్నారు. స్థానిక కాంగ్రెస్‌వాదులు ఆయన సభలకు ఏర్పాట్లు చేస్తున్నారు. జనాన్ని కూడా తరలిస్తున్నారు.

జిల్లా కేంద్రాల పర్యటన ముగిసిన తర్వాత శ్రీనివాసులురెడ్డి ఏం చేయ గలిగింది ఏమిటి? అప్పటికి ఆయన వేడి చల్లారిపోదా? ప్రజల ఉత్సాహంకూడా చల్లబడిపోదా? అని తెలుగుదేశం నాయకులు ఎదురు చూస్తున్నారు. నిజానికి శ్రీనివాసులురెడ్డి సభలకు వస్తున్న వేలాదిజనం ఆయన అభిమానులుకారు. ఎన్. టి. ఆర్. వ్యతిరేకులు. వీరిలో ఎక్కువమంది కాంగ్రెసు అభిమానులు. రామారావుకు వ్యతిరేకంగా పోరాడుతున్న వర్గాలకు చెందినవారు. అందువల్ల కారణంగా శ్రీనివాసులురెడ్డి నాయకత్వాన్ని ఆమోదించి ఆయనవెంట వుంటారని అనుకోవడం కష్టం. నిజంగా అదే జరిగితే శ్రీనివాసులురెడ్డి కొత్త పార్టీయే పెడతారు. శ్రీ రామారావును వ్యతిరేకంగా మరొక ప్రాంతీయపార్టీని పెట్టడానికి ఆయన తప్పకుండా ప్రయత్నిస్తాం. రెండు ప్రాంతీయ పార్టీల వ్యవస్థను రాష్ట్రంలో నెలకొల్పడం శ్రీనివాసులురెడ్డి ఆలోచన కావచ్చుగాని, క్రమేపి జనం ఎటువైపు మొగ్గుతారనే విషయంపై ఆయన నిర్ణయం ఆధారపడివుంటుంది.

## కేంద్ర విచారణ సంఘం భయమే తెలుగు నాయకులను వణికిస్తున్నది!

అందుకే ఆయన తన రాజకీయభవిష్యత్తుపై ప్రజాభిప్రాయం ప్రకారం సరైన సమయంలో నిర్ణయం తీసుకుంటానని చెబుతున్నారు.

తెలుగుదేశంలో చీలిక వస్తుందని, తర్వాత రామారావు ప్రభుత్వాన్ని పడగొట్టగలమని శ్రీనివాసులురెడ్డి ఏనాడైనా ఆశలు పెట్టుకుంటే అవేవీ వెంటనే నెరవేరే సూచనలు కనిపించడం లేదు. ఆయన రామారావు ప్రభుత్వ పతనానికి మొదట డిసెంబరులో ముహూర్తం పెట్టారు. తర్వాత వసనా వివిధ సభలలో జనవరి, ఫిబ్రవరి, ఇప్పుడు మార్చికి ముహూర్తాలను మార్చారు. పార్టీలో వ్యక్తం అవుతున్న నమ్మకత్వవల్ల శ్రీనివాసులురెడ్డి పతనము

—కొరవ 7 వ పేజీలో

# ఎవరూ చేయలేని పని చేసి చూపించాడు-
# కాంగ్రెస్ భవనానికి శాపవిముక్తి కల్గించాడు!

జిల్లా కాంగ్రెస్ భవన నిర్మాణ ప్రయత్నానికిది స్వర్ణోత్సవ నిర్మిత మైన కాంగ్రెస్ భవన ప్రారంభోత్సవ సమయమూ ఇదే! అంటే కాంగ్రెస్ పార్టీ భవన కూ ఒక స్వంతగూడు ఏర్పాటు చేసుకోవడానికి సరిగ్గా అర్ధశతాబ్ది పట్టిం దన్నమాట. ఈ మధ్యకాలంలో ఆ మహో వృక్షం నీడన ఎన్ని రాజకీయ కుటుం బాలు సేదతీరాయో, ఎందరెందరు నాయ కులుగా గద్దెలెక్కి రాజ్యాలేలారో లెక్కలేదు. వారెవరికీ పట్టనిదాన్ని, వారెవరూ పూను కుని కూడా పూర్తిచేయలేని కార్యాన్ని శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి తన యువ శక్తిని వినియోగించి నెరవేర్చారు. యాభయ్యేళ్ళ సుదీర్ఘ నిర్లక్ష్యపు చెరలో, శిథిల ప్రాంగణంలో, అవమానపూరిత ఆకృతితో, దిగులుగా, దీనంగా, దయనీ యంగా వుండిపోయిన జిల్లా కాంగ్రెస్ స్థలాని శాపవిముక్తి కల్గించారు. జిల్లాలో కాంగ్రెస్‌పార్టీ వున్నన్నినాళ్ళు జనార్దన రెడ్డి పేరు శాశ్వతంగా నిల్చిపోతుంది. ఆయన రాజకీయ జీవితానికి సార్ధకత చేకూరినట్టుంది!

జిల్లాలో కాంగ్రెస్ పార్టీకి ఒక స్వంత భవనం నిర్మించాలన్న సంకల్పం 1930 దశాబ్దంలో చెలరేగింది. అప్పట్లోనే పుంజుకొని సూర్యభగవాను అన్నే ఈశ్వరయ్యలకు సంబం ధించిన స్థలం వేలం వేయడం ద్వారా జరి గింది. అప్పుడు పొగతోట అని పిలు స్తున్న అనాటి గాంధీ చౌకలో వుండేది ఈ స్థలం.

## కాంగ్రెస్ చరిత్రలో జనార్దనరెడ్డి పేరు చిరస్థాయిగా నిల్చిపోతుంది!

1935 లో కాంగ్రెస్‌పార్టీ స్వర్ణోత్సవ సమయంలో ఈ ప్రతిపాదన మళ్ళీ పరిశీలనలోకి వచ్చింది. అంతకు క్రితం వేలం వేసిన స్థలాన్ని, అప్పుడు 1626 రూపాయలకు కొనుగోలు చేశారు. డిసెం బరు 28 తేది శ్రీ అనంతర్ల సుబ్బారావు భవనానికి శంకుస్థాపన చేశారు.

పునాదిరాయితోనే ఆ ప్రతిపాదన సమాధైపోయింది. తిరిగి 1937 లో స్థలంకోసం కుదుర్చుకున్న మొత్తంలో 771 రూపాయలు మాత్రం చెల్లించింది అనాటి జి. కాం. కమిటీ! 1937 అక్టో బరు ప్రాంతంలో 1096 రూపాయల వరకు చెల్లించినట్లు 'జమీన్ రైతు' పత్రి కలో ఒకవార్తవుంది. తరువాత మిగిలిన ఎప్పుడు కట్టారో తెలుసుకోవడానికి ఆధా రాలు దొరకడంలేదు. అయితే 1937లోనే ఆ స్థలం కాంగ్రెస్ వశమైందనుకోవచ్చు.

స్థలాన్ని తీసుకున్నా భవనాన్ని నిర్మించగలమన్న ధైర్యం ఎవరూ చేయలేదు. 1950 లో స్వర్గీయ ఎ. సి. సుబ్బారెడ్డి మునిసిపల్ ఛైర్మెన్‌గా, జి. కాం. అధ్య క్షుడుగావున్నప్పుడు మరోసారి పరిశీలన లోకి వచ్చింది. కొంత కొన్నస్థలం సరి పోదని భావించడంవల్ల ఎ. సి. సుబ్బా రెడ్డిగారు 37 సెంట్ల మునిసిపల్ భూమిని ఇవ్వడానికి ముందుకొచ్చారు. ఇప్పు డున్న స్థలం అదే! అది చేతికిరాగానే పాత పొగతోటస్థలం అమ్మకానికి పెట్టారు. 28 వేలకు అమ్ముడు పోయిందది. జి. కాం లో వున్న మిగులు, విరాళాలు ప్రోగుచేసి లక్షా 10 వేలరూపాయల నిధి సమకూర్చారు. భవన నిర్మాణం మొదలు పెట్టారు, గోడలు పైకిలేచి కప్పు వేయ బోయేసమయానికి పునాదుల్లో పగుళ్ళు కన్పించాయి. అక్కడి నేల తీరే దీనికి కారణమంటారు. ఆరోజుల్లో ఈసమస్యను పరిష్కరించగల ఇంజనీరింగు నిపుణులు దొరకలేదో, లేక అంతటి సంకల్పబలం కల్గిన నాయకులే కరువైనారోకాని నిర్మాణం నిల్చిపోయింది.

అప్పటినుంచి ముప్పయ్యేళ్ళపాటు

—కొరకు 7 వ పేజీలో



# కమీషనరు బదలీతో
# కావలి ఛైర్మెన్‌కు పరాభవం!

కావలి మునిసిపల్ ఛైర్మన్ డాక్టర్ ప్రభాకరనాయుడు కష్టాల్లో పడ్డారు అదీ కమీషనరు బదలీతో!

కావలి కమీషనరు శ్రీ లక్ష్మీనారా యణరెడ్డి, ఛైర్మన్ అభిమాన పాత్రుడు. వచ్చి ఏకాడి దాటకున్నా అందరి మంచి చూరగొన్నవాడు. అయితే ఛైర్మన్ పొడ గిట్టని తెలుగుదేశం కౌన్సిలర్లకు ఆయన్ను చూస్తే వంటికి కారం రాసుకున్నట్టుండే దట. వారంతా కట్టగట్టుకుని, పట్టుబట్టి ఆయన్ను కర్నూలుకు బదలీ చేయిం చారు కర్నూలులో ఛాల్యుయేషన్ ఆఫీ సరు శ్రీ ఎన్. రామమోహనరావు కమీ షనర్‌గా ఇక్కడికి వచ్చారు.

తనకు తెలియకుండా తన కమీష నర్‌ను బదలీ చేయడమేమిటని ప్రభాకర నాయుడు మునిసిపల్ మంత్రిని కావలి లోనే పిలిచాడట మరికొందరు కౌన్సి లర్లూ కూడా కమీషనర్ చేస్తున్న మంచి పనులు వివరించి, బదలీ చేస్తే జరిగే నష్టాన్ని విన్నవించడంతో, మోహనరెడ్డి అక్కడికక్కడే బదలీ ఉత్తర్వులు రద్దు చేస్తున్నట్లు ప్రకటించారు. రామమోహన

## జిల్లా వార్తలు

రావును ఎమ్మిగనూరుకు బదలీచేసినట్లు చెప్పి, విలేఖరుల సమావేశంలోనే రామ మోహనరావును పిల్చి, 28 తేదీ హైదరా బాదులో ఆర్డరు తీసుకోమని చెప్పారు. మంత్రి తనమాట విన్నందుకు ఛైర్మనూ సంతోషించారు

ఇది తెలియగానే ఛైర్మన్ ప్రత్యర్థి కౌన్సిలర్లు గండిపేటకు పరుగెత్తారు. లక్ష్మీనారాయణరెడ్డి శ్రీనివాసులురెడ్డికి సన్నిహితుడని, గూడూరీయుడని, ఆయన కావలిలోనే వుంటే ఛైర్మన్‌కూడా శీనయ్య సేనకు తరలిపోతాడని దాడిలు చెప్పా రట. చంద్రబాబు ఈ చెప్పారు మాటలు నిజమో కాదో నిర్ధారించకుండానే, మంత్రి మోహనరెడ్డికి ఫోన్‌చేసి, కమీషనరును తక్షణం బదలీ చేయమని ఆదేశించాడట. బాబంతటివాడు చెప్తే ఆయన చేయ గల్గిందేముంది?

ఇప్పుడీ బదలీ ప్రభాకరనాయుడి గారికి ప్రతిష్టా సమస్యగా తయారయిం చింది. తనకు పరాభవం జరిగిందని ఉడికిపోతున్నాడాయన! ప్రత్యర్థి కౌన్సి లర్లు చంకలు కొట్టుకోవడం ఆయన కు మరీ పుండుమీద కారం చల్లినట్టుగావుంది. చంద్రబాబుతో సాన్నిహిత్యం కూడా ఆయనకీ సమయంలో ఉపయోగపడటం లేదు, పాపం!

### విద్యానగర్ ఎన్. ఎస్. ఎస్.

విద్యానగర్ నేదురుమల్లి బాలకృష్ణా రెడ్డి సైన్సు అండ్ ఆర్ట్సు కాలేజి జాతీయ సేవాపథకం విద్యార్థులు నవంబరును పరిసరాల పరిశుభ్రత, మొక్కల పెంపకం నెలగా పాటించారు. ప్రిన్సిపాల్ శ్రీ డి. బాలకృష్ణారెడ్డి ఆధ్వర్యంలో ఎన్. ఎస్ ఎస్. ప్రోగ్రాం ఆఫీసర్లు శ్రీ జి. విల్లర జయకుమార్, శ్రీ ఎస్ కె. మొహిద్దీన్ పర్యవేక్షణలో 40 మంది విద్యార్థులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. కళా శాలం, గురుకులం, కాలేజి హాస్టళ్ళ పరి సరాలలో మొక్కలు నాటారు.

### రివ్వలకాల్వ పూడిక తీయరా?

కనుపర్తి పాడు కోని నక్కలపల్లి దాకా వెంబడివున్న రివ్వలకాల్వ డ్రైను లో

—కొరకు 7వ పేజీలో

# పినాకినీతీరం

(పిన పేజి తరువాయి)

ఎన్నికలలో గన్న [illegible] కొన్నారు; ఎన్ని చంద్రశేఖరరెడ్డి [illegible] [illegible] లేదు; గూడూరు కాంగ్రెస్ అభ్యర్థిగా ఒక అనామకుడిని నియమించబడింది.... ఈ రాజాపరణాన్ని గ్రహించి, కాంగ్రెస్ తిరుగుబాటు జాపుటా ఎగురవేసి స్వతంత్రుడుగా గూడూరు [illegible] మొదట ఎన్నికయ్యారు; తర్వాత కాంగ్రెస్‌లో చేరాడు.

1978 లో ఇందిరా కాంగ్రెస్ [illegible] చూశాడు; కు యే క యే అవసరంగా కాంగ్రెస్ టికెట్ సంపాదించు కొని, వేసుంగా వెంకటగిరి నియోజక వర్గం నుండి ఎన్నికైనారు.

తాను రెండవసారి శాసన సభ్యుడైనా; అనాటి ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి తన పోటీదారు చంద్రశేఖరరెడ్డికి అతి ముఖ్యుడైనా; కనీసం ఎం. ఎల్. సి. కూడా కాని జనార్దనరెడ్డికి మంత్రిత్వం లావడంతో ఆతనికి కడుపు రగ్గుకున్నది. జనార్దనరెడ్డి నామమాత్రపు డిప్యూటీమంత్రి కాకుండా, పెద్ద మంత్రిగా అతి [illegible] స్థానాన్ని పొందారు. విశ్రాంతి ఎరుగని వీరుడుగా ఎంత పోరాడినా అంజయ్య హయాంలో కొద్దికాలంతప్ప తనకు మంత్రిత్వం లభించలేదు; కాంగ్రెస్ పునర్వ్యవస్థీకరణలో పట్టు దొరకలేదు; జనార్దనరెడ్డి ఆంతరంగికుడు కాలేదు. ఏటన్నిటికీ మించి తరచు ముఖ్యమంత్రుల మార్పుతో, ఆవినీతితో రాష్ట్రంలో అప్రతిష్ట పాలైన కాంగ్రెస్ 1983 ఎన్నికలలో గెలువలేదని ఊహించాడు. అదే సమయంలో ఎన్. టి. రామారావు తెలుగుదేశంపార్టీ పెట్టారు; శ్రీనివాసులురెడ్డిగారు ఎన్నికలు మూడునెలలున్నదనగా శాసనసభ్యత్వాన్ని 'త్యాగం'చేసి పాపో మరి పోయి తెలుగుదేశంలో చేరారు; ఆయనననుగానే వచ్చే తెలుగుదేశం విజయం గాంచింది. వారూ నంబర్.టు మంత్రి త్వాన్ని పొందారు.

ఇక్కడకు ఎన్నికలు జరగలేదు శేషు గాని, ఏదోఒక కారణంగా రామారావు ప్రభుత్వం పతనమవుతుందని శ్రీనివాసులు రెడ్డి పసికట్టారు; కొత్త మార్గం వెతుక్కోవాలి! అనుకున్నారు. అవకాశవాది అనే పెద్దపేరు రాకుండా వుండేందుకు ముందుగానే ఎత్తు వేసి రామారావుమీద ధ్వజం! ఎటువంటి ఎటువస్తుందోనని ముందుజాగ్రత్తగా శాసన సభ్యత్వానికి రాజీనామా ఇవ్వలేదు: వాతావరణం ఎవరికి అనుకూలంగా వుండబోతుందో, ఏమి కాబోతుందోనని ఇంకా ఏ పార్టీలో చేరలేదు!

ఇదండి శ్రీనివాసులురెడ్డిగారి ఆత్మ ప్రబోధపు అసలు రహస్యం! మనం దీన్ని అవకాశవాదమంటాము; ఆయన ఆత్మ ప్రబోధమంటారు; అంతే తేడా! ఏమైతేనేమి, వెంగళరావుగారు చెలిబుచ్చి [illegible] రామారావుకు తిరిగి [illegible] కాంగ్రెస్‌కు తప్పించారు శ్రీనివాసులురెడ్డి!

## ఛేంబర్ ఆఫ్ కామర్స్ పసుపు పూసుకున్నది!

నెల్లూరు జిల్లా ఛేంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ కార్యదర్శి రాజీనామా శ్రీ పొమ్మిన సుబ్రహ్మణ్యం రైల్వే శాఖకు కొన్ని సౌకర్యాలకై ఒక విజ్ఞాపన పత్రం పంపారు ఈ సంఘం అధ్యక్షుడు శ్రీ సి. పి. సుబ్బారాయుడుశెట్టి ఎం. ఎ.

ఆ సంఘం విజ్ఞాపన పత్రంలోని కోర్కెలు నెల్లూరు పట్టణ పౌరులందరూ కోరదగినవి, అత్యవసరంగా తీర్చదగినవి. కాని ఆవార్త వచ్చిన ఆ సంఘం లెటర్‌హెడ్ కాగితం పసుపు రంగు పులుముకొనివుంది ఏమిటా అనేది నా సందేహం. పసుపురంగు అంటే మీకు తెలుసుగదా ప్రస్తుతం తెలుగుదేశంవారు స్వంతంచేసుకున్న రంగు. మొక్కుబడితో తిరుపతికిపోయే భక్తులు పసుపుగుడ్డలు కట్టుకున్నట్లు, తెలుగుదేశీయులు పసుపు బట్టలు ధరిస్తారు. అదేవిధంగా ఈ సంఘంవారు రాజకీయ యోగం చేకగితాలకూడా పసుపురంగునే ఎన్నుకోలేదుగదా.

సుబ్బారాయుడుశెట్టిగారు తెలుగు దేశీయుడనే విషయం అందరికీ తెలిసిందే! కాని పొమ్మినవారుగాని, లేక నెల్లూరు ఛేంబర్ ఆఫ్ కామర్స్ సంస్థగాని ఆ పార్టీలో చేరినట్లు నేను వినలేదు; ఈ పసుపుకాగితాన్ని ఒత్తి పూహించడమే. ఒకవేళ సుబ్బారాయుడుగారికి తోడుగా సుబ్రహ్మణ్యంగారు చేరితే చేరవచ్చు గాని, ఆ సంస్థ ఎందుకు చేరుతుంది అని నాకు నేనే సమాధానం చెప్పకొని సరిపెట్టుకొంటున్నాను. జనబాహుళ్యానికి సంబంధించిన కోర్కెలు ఎవరు కోరినా, ఏ పార్టీ కోరినా సంతోషించాలి. నెల్లూరు ఛేంబర్ ఆఫ్ కామర్స్ కోర్కెలను రైల్వే శాఖ వెంటనే తీర్చాలని నెల్లూరీయు లందరి విజ్ఞప్తి.



## ●● ఉత్తరక్రియలు

మా అల్లుడు

**పి. వేణుగోపాలరెడ్డి** I.P.S.

( Asst. Post Master General, Madras )

మనుమరాలు

**హేమసుప్రియ**

12-12-87 తేది అకాలమరణం చెందినారు.

వారి ఉత్తరక్రియలు

23-12-87 తేది బుధవారం శిలాప్రతిష్ఠ

24-12-87 తేది బేస్తవారం శుభస్వీకరణం (పెద్దకర్మ)

చిల్లకూరు మండలం బల్లవోలులో జరుగును.

వంటేరు కోదండరామరెడ్డి
కంట్రాక్టర్, తిరుపతి.

Edited, Printed & Published by I. Dolandra Prasad at the Zamin Ryot Press, Nellore-524001